## బుడమేటి వరద ప్రాంతాలు

### శ్రీ రాజగోపాలా గారి పర్యటన

గుడివాడ, అక్టోబరు 2. బుడమేటి వరదలవలన నష్టపడిన గ్రామాలలో శాసనసభ్యులు శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావుగారు పర్యటించారు. వారి వెంట తాలూకా రైతు సంఘ కార్యదర్శి శ్రీ వై. వెంకటరావు, వి. రామదాసు గారలు వున్నారు. వీరు పుట్టగుంట మీదుగా వడ్లమెరక, చాతుత్రిపాడు, మోపర్రు, జనార్దనపురం గ్రామాలు సందర్శించారు. కవులూరు మరలింపు ప్రణాళికను అమలు జరపాలనీ, బుడమేటి వరదగండ్లను ప్రభుత్వం వారే తీసుకోవాలని రైతులు మహాజర్లు సమర్పించారు.

## ప్రజాసోషలిస్టుల ప్రకటన

గుడివాడ, అక్టోబరు 2: ఆంధ్ర ప్రజా సోషలిస్టు పార్టీ సహాయ కార్యదర్శి శ్రీ బి. రత్న సభాపతి, కృష్ణా జిల్లా ప్రజాసోషలిస్టుపార్టీ అధ్యక్షులు శ్రీ పాటూరు వెంకటే ఇలా ఒక సంయుక్త ప్రకటనచేశారు:

బుడమేరు కృష్ణాజిల్లాలోని విజయవాడ, గన్నవరం, గుడివాడ, కైకలూరు తాలూకాలలో విపరీతమైన వరదల వల్ల అపారనష్టం కలుగజేస్తున్నది. గత అనేక సం॥ గా వివిధ రాజకీయపార్టీలు ప్రజాసంస్థలు కవులూరు మరలింపు ...

## అమెరికాలో శ్వేత జాతి ఉద్యమం

### సన్నగిల్లుతున్న సూచన

## ప్యాసుపోర్టులపై కేంద్ర అధికారం

### నవంబరులో తీసుకునే సూచన

# జర్మనీ ఆయుధ పునర్ధరణ ఒప్పందం

## బాన్ పార్లమెంటు ఆమోదం

బాన్, అక్టోబరు 7: జర్మనీ ఆయుధ పునర్ధారణకై 9 రాజ్యాలు లండన్‌లో చేసుకున్న ఒప్పందాన్ని పశ్చిమ జర్మనీ పార్లమెంటు నేడిక్కడ ఆమోదించింది.

జర్మనీ ఐక్యతను సాధించే నిమిత్తం 4 ఆక్రమణ రాజ్యాలమధ్యను సంప్రదింపులు జరగాలని సోషల్ డెమొక్రాట్ ప్రతినిధులు ఈ ఒప్పందానికి ప్రత్యామ్నాయంగా ఒక ప్రతిపాదన చేశారు. దానిని పార్లమెంటు సెలక్టుకమిటీకి ఉదహరించింది.

చర్చలో సోషలిస్టులు లండన్ ఒప్పందాన్ని చాలా విమర్శించారు. ...

## ఫ్రెంచిపార్లమెంటులో ప్రధాని వివరణ

## తూర్పుజర్మనీకి రష్యా అండ

## నైరృతి ఆఫ్రికా దక్షిణాఫ్రికా విధానంపై రష్యాఖండన

## దయ్యూ గవర్నరు బోటు

## గ్రామ గ్రామాల్లో బాలసంఘాలు

### కర్నూలుసభ తీర్మానం

కర్నూలు, అక్టోబరు 6: ఆంధ్ర రాజధానిలో ఈనెల 2, 3, 4 తేదీలలో జరిగిన ఆంధ్రబాల మహాసభలో అనేక తీర్మానాలు చేశారు. కేంద్ర బాలానంద సంఘానికి అనుబంధ సంస్థలుగా ప్రతిగ్రామంలోను బాల సంఘం ఏర్పడాలని నరసాపుర బాల సంఘం వారు ప్రతిపాదించారు. మదనపల్లె విజయ బాలసంఘంవారు బలపరిచారు.

ప్రతి గ్రామంలోని బాల సంఘానికి ప్రభుత్వంవారు ఒక ఆటస్థలం నాటకశాల మొదలయినవి నిర్మించుకోవటానికి స్థలం ఉచితంగా మంజూరు చేయాలని కోరుతూ ఒక తీర్మానాన్ని మదనపల్లెవారు ప్రతిపాదించగా చిత్తూరువారు బలపరిచారు. ...

## కమ్యూనిస్టులప్రత్యక్షచర్య

### కర్నూలు అధికార వర్గాలకు వార్తలు

## ఆసియా-ఆఫ్రికా దేశాల స్నేహం

### సూడాన్‌మంత్రి ఉద్ఘాటన

## నందికొండ ప్రాజెక్టు నిర్మాణం

### కర్నూలు జిల్లా కాంగ్రెసు అధ్యక్షుని ప్రకటనకు సమాధానం

పెదకూరపాడు, అక్టోబరు 4: నందికొండ ప్రాజెక్టును నిర్మించటం అన్యాయమంటూ కర్నూలు జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్యగారు చేసిన ప్రకటనను విమర్శిస్తూ గుంటూరుజిల్లా కాంగ్రెసు సహాయకార్యదర్శి శ్రీ యస్. వెంకటరామారావుగారు ఇలా ప్రకటిస్తున్నారు.

"నందికొండను నిర్మించడం అన్యాయం అని కర్నూలుజిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్యగారు చేసిన ప్రకటన చాలా హృదయ విదారకం. అంతేకాక వారు బాధ్యతా రహితంగా కూడా ప్రవర్తించారనుటలో అతిశయోక్తి కూడా లేదు.

నందికొండప్రాజెక్టు నిర్మాణమై జరుగుచున్న ఆందోళన వారికి బాధకరంగా ఎందుకు తోచిందో అర్థం కావడంలేదు. రాయలసీమ సర్కారులు వేర్వేరు జిల్లాలేగాని వేర్వేరు రాష్ట్రాలు గావని మనవి చేస్తున్నాము.

ప్లానింగు కమీషన్ నియమానుసారం పరిశీలించిన ఖోస్లా కమిటీవారు తక్కువ వ్యయముతో హెచ్చు ఆదాయము కలిగిన నందికొండ ప్రాజెక్టును ... "

# 'జర్మనీ ఏకీకరణకు ఉభయపక్షాల ప్రత్యక్ష సమాలోచనలు జరగాలి'

## —సమితిలో కృష్ణమీనన్ సూచన

న్యూయార్కు, అక్టోబరు 7: జర్మనీ సమస్యాపరిష్కారానికి తూర్పు పశ్చిమ జర్మనీలమధ్య సౌహార్ద్ర సమాలోచనలు ప్రారంభం కావడం మంచిదని, ఇందువల్ల కొన్ని సత్ఫలితాలు కిల్గవచ్చునని సమితిలో భారతప్రతినిధి శ్రీ కృష్ణమీనన్ సూచించారు.

"ప్రపంచంలో శాంతి ఏర్పడాలంటే, జర్మనీలో శాంతి ఏర్పడాలి. జర్మనీ ఐక్యంకాకుండా మరి అక్కడ శాంతి సాధ్యంకాదు. పోతే ప్రపంచ శాంతికి సంబంధించిన ఏ సమస్యను గురించి అయినాసరే ఇండియా తన భావాలను విధిగా వ్యక్తం చేస్తుంది. అందువల్లనే ఈ జర్మన్ వ్యవహారాన్ని గురించి మేము మాట్లాడుతున్నాము." అనికూడా శ్రీ కృష్ణమీనన్ ఉద్ఘాటించారు.

## వేటపాలెంలో కవితాగోష్ఠి

### సారస్వత నికేతన జయంతి ఉత్సవాలు

వేటపాలెం, అక్టోబరు 6: 'సారస్వత నికేతన' జయంత్యుత్సవ సభలు సందర్భాన నిన్న సాయంత్రం కవితాగోష్ఠి శ్రీ స్వామీ శివశంకరులు అధ్యక్షతన జరిగింది. శ్రీ మేళ్ళ చెరువు అంజనేయ శర్మగారి ప్రార్థనతో గోష్ఠి ప్రారంభమైంది. ...

## రష్యాకు వెళ్లుతున్న ప్రతినిధులకు సన్మానం

# వాణిజ్య పన్నులద్వారా మరో కోటి ఆదాయం

## అదనపు సిబ్బందినివేస్తే చేకూర్చగలనని

## ఆంధ్రమంత్రి హామీ: కొత్త రాబడికి అన్వేషణ

## సింహళ భారతదేశాల స్నేహపునరుద్ధరణ

(1 వ పేజీ తరువాయి)

వాళ్ళను చేస్తే చెప్పలేం అన్నారు.

"ఎవరు చేస్తే?" అన్న ప్రశ్నకు సమాధానం ఇస్తూ సర్ జాన్, "మీరూ మేమూ, ఇద్దరమూ," అన్నారు. "సింహళంలో వున్న భారతీయులు సింహళం పౌరులుగా నైనా వుండాలి లేదా ఇండియా పౌరులుగా అన్నా వుండాలి" అంటూ ఆయన వాదించారు.

ఈ సమాలోచనలు అధికారికంగా ప్రారంభం కావడానికి ముందు షడ్లీ సేనానాయకే, బండారు నాయకేలు ప్రధాన మంత్రిని కలుసుకుంటారు. ఈ రాజ్యం లేని ప్రజను గూర్చి తమ భావాలు ఏమిటో నెహ్రూకు నివేదిస్తారు. ఇట్టి 6 లక్షల జనానికి భారతీయ పౌరసత్వాన్ని ఇవ్వవలసిందిగా కూడా వీరు నెహ్రూను కోరుతారు.

విలేఖర్లు అనంతరం ఆయన్ను మనిలా సంధిని గురించి నెహ్రూ-చౌ శాంతి సూత్రాలను గురించి ప్రశ్నించారు. సర్ జాన్ మనిలాసంధి "చచ్చిపోయింది," అన్నారు. అది ఇప్పుడు వట్టి కాగితం అన్నారు.

చౌ-నెహ్రూ సూత్రాలు ప్రపంచంలో ఏ ప్రాంతంలోనైనా పడతాయిఅన్నారు. ఆఫ్రో-ఏషియన్ మహాసభనుగూర్చి మాట్లాడుతూ తన్ను గనుక నెహ్రూగారుఅడిగితే, తనభావాలు ఏమిటో చెబుతానని, ప్రస్తుతం తాను ఇండో-సింహళ వ్యవహారాలనుగూర్చి మాత్రమే చర్చించడానికి వచ్చానని చెప్పారు. ...

## సింహళ భారతీయ కాంగ్రెస్ ప్రతినిధులు

## దెబ్బలో ఇద్దరు ఆఫ్రికన్ల మరణం

## ఉద్యోగ వార్తలు

## మైసూరు దసరా వేడుకలో ఒక స్త్రీ మృతి

### చాలామందికి గాయాలు

## వరదముంపు నివారణ చర్యలు

### విజయవాడ ఇంజనీరుకు విజ్ఞప్తి

విజయవాడ, అక్టోబరు 6: గుంటూరు కృష్ణాజిల్లాలలో ఇటీవలి అధిక వర్షాలు, వరదముంపులవలన కలిగిన నష్టాల వివరాలను ఆంధ్రరాష్ట్ర కిసాన్ సమ్మేళనం అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు, శ్రీ జేవీ సేవ రామకోటయ్యగారు విజయవాడ ప్రాంత సూపరింటెండెంటు ఇంజనీరు గారికి విన్నవించారు. అందుకు నివారణ చర్యలు తీసుకోవాలని కోరగా ఇంజనీరు బుడమేరు మొదలయినవాటి గండ్లు పూడ్పించి కట్టలు పోయించుటకు పబ్లిక్ వర్క్సువారికి కావలసిన చోట రైతులు భూములుఇవ్వాలని లేకపోతే మరమ్మత్తు వెంటనే సాధ్యపడదని చెప్పారు.

శ్రీ వెంకటసుబ్బయ్యగారు ఒక ప్రకటన చేస్తూ పంటనీటి ఏర్పాట్లతోపాటు మురుగునీటి సౌకర్యంకూడా కల్పించనందున ఇటువంటి ఇబ్బందులు కలుగుతున్నాయనీ, ప్రభుత్వంవారు అవసరాలు కల్పించుటందుకుకూడా పూనుకోవాలని విజ్ఞప్తిచేశారు.

## మద్య నిషేధం

### కృష్ణా లోక్‌పార్టీ కార్యదర్శి అరెస్టు

## నాటుపొగాకు రైతు మహాసభ వాయిదా

## యాళ్లూరు ఆసుపత్రిక ప్రారంభోత్సవం

## దేవాలయాల ఆదాయం

## ఆంధ్రపత్రిక

### చందా వివరములు

దినపత్రిక

(ఆదివారపు సంచికతో సహా)

| | రూ.అ.పై. |
|---|---|
| సంవత్సర చందా ... | 26- 0-0 |
| అర్ధసంవత్సర చందా ... | 13- 8-0 |
| మూడుమాసములచందా... | 6-12-0 |
| నెలచందా ... | 2- 4-0 |

విడిప్రతి ఆదివారం 2 అణాలు, ఇతర దినములు 1 అణా.

సచిత్ర వారపత్రిక

| | |
|---|---|
| సంవత్సర చందా ... | 12-0-0 |
| అర్ధ సంవత్సర చందా ... | 6-8-0 |

విడిప్రతి 4 అణాలు.

భారతి (సచిత్ర మాసపత్రిక)

| | |
|---|---|
| సంవత్సర చందా ... | 12-0-0 |
| అర్ధ సంవత్సర చందా ... | 6-0-0 |
| విడిప్రతి ... | 1-0-0 |

# ఖూనీ కేసు ముద్దాయిల విడుదల

## రాజమండ్రి సెషన్సు జడ్జీ తీర్పు

(స్వకీయ విలేఖరి)

రాజమండ్రి, అక్టోబరు 6: కాకినాడ తాలూకా దుగ్గుదురు ఖూనీ కేసు సందర్భంలో ఇక్కడ సెషన్సు జడ్జి దరిశి రంగయ్య శెట్టిగారు నలుగురు అసెసర్లలో ముగ్గురు వెలువరించిన అభిప్రాయంతో ఏకీభవిస్తూ ముద్దాయిలపై మోపబడిన ఏ నేరమూ సమిష్టిగా గానీ, విడివిడిగా గానీ ఋజువు చేయబడలేదనీ, కక్షలు ఫలితమే ఈ కేసు అని భావిస్తున్నామనీ, వివరిస్తూ ముద్దాయిలందరనూ నిర్దోషులుగా నిర్ణయిస్తూ, అందరినీ విడుదల చేస్తూ 4 వ తేదీన తీర్పు ఇచ్చారు.

కాకినాడ తాలూకా దుగ్గుదురు గ్రామంలో గత ఏప్రిల్ 7 వ తేదీన రైతులలో జరిగిన కొట్లాటలోని దెబ్బల ఫలితంగా ముగ్గురు మరణించారు. ఆ సందర్భంలో ఐ. పి. సి. 84, 147, 149 వగైరా సెక్షన్ల క్రింద కోరంగి పోలీసు వారు దుగ్గుదురు శివారు పాటిమీద శెట్టిబలిజపేట నివాసులైన శ్రీ పీతానివిరయ్య వగైరా 16 గురు మీద కేసు పెట్టారు. కాకినాడ అడిషనల్ స్పెషల్ ఫస్ట్ మేజిస్ట్రేట్ వద్ద ప్రథమ విచారణ జరిగింది. అక్కడ సెషన్సు కోర్టుకు పంపారు.

ప్రాసిక్యూషన్ తరఫున ఎర్రా పార్థసారథిస్వామి, ముద్దాయిల తరఫున రామలింగం, డి. వి. సుబ్బారావు, చోడవరపు రంగారావు మొదలగువారు వాదించారు.

# గుంటూరు హెడ్ కానిస్టేబిల్ అరెస్టు

## లంచం పుచ్చుకొన్నాడనే నేరంపై

గుంటూరు, అక్టోబరు 8: జిల్లా పోలీసు సూపరింటెండెంటు కె. ఎం. లోకన్‌గారి ఉత్తర్వుల ననుసరించి డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు శ్రీ రాఘవేంద్రరావుగారు నాయుడుగారు అడిషనల్ ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు శ్రీ పి. వి. సుబ్బయ్య పంతులు, టౌన్ సర్కిల్ ఇన్‌స్పెక్టరు శ్రీ మహమ్మద్ లతీఫ్ గారలను వెంటబెట్టుకొని నిన్న తాలూకా పోలీసుస్టేషన్ హెడ్ కానిస్టేబిల్ గోపిశెట్టి యల్లమందను అరెస్టుచేశారు. ఒక క్రిమినల్ కేసులో లంచం పుచ్చుకొన్నాడనే ఆరోపణపై యీ అరెస్టు జరిగింది.

ఒక క్రిమినల్ కేసులో ముద్దాయిగా విచారణలో వున్న గోరంట్ల వాస్తవ్యుడు సంగం రామకోటిరెడ్డి అనువద్ద 30 రూ. లు లంచంగా యివ్వవలసిందని యీ హెడ్ కానిస్టేబుల్ అడిగాడని, అలంచం ఇచ్చినట్లయితే, యీ కేసులో సహాయం చేస్తానని హామీ యిచ్చాడని యీ సంగతి పై అధికారులకు తెలుపగా, అడిషనల్ ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు, డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు, టౌన్ సర్కిల్ ఇన్‌స్పెక్టరు వలపన్ని నుద్దు పెట్టిననోట్లు సదరు హెడ్ కానిస్టేబుల్‌కు అందచేసి, అవెంటనే అతని యిల్లు సోదా చేయగా ఆనోట్లు అతనిజేబులో దొరికాయని వెంటనే అరెస్టుచేశారని తెలియవచ్చింది. ఆహెడ్ కానిస్టేబిలును సస్పెన్షనులో ఉంచారు.

తాలూకా సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారు కేసు దర్యాప్తుచేస్తున్నారు.

## జేబు దొంగలకు 2 సం॥ రాల శిక్ష

గుంటూరు, అక్టోబరు 8: పిడుగురాళ్ల స్టేషనులో ఒకవద్దనుండి 2200 రూ. లు జేబుదొంగతనం చేసినందుకు ఇద్దరు పిల్లవాళ్లను రైల్వేపోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు యం. ఎస్. ఎన్. మూర్తి గారు అరెస్టుచేశారు. నిందితులు దాచర్ల స్టేషనులో పట్టుబడ్డారు. 1300 రూ. లు దొరికినవి. మిగతా 900 నిందితులు తింద్రి తీసుకొన్నాడట. అతను కన్పించలేదు. పిల్లవాళ్లిద్దరికి 2 సం॥ రాలు శిక్ష విధించి చెంగల్పట్టు బోర్స్టల్ స్కూలుకు పంపారు.

## చోరీ నేరస్థుని అరెస్టు

కాళహస్తి, అక్టోబరు 8: బ్రిటగుంట పెటిల్మెంటుకు చెందిన బోగిలదాసీదు అనువాడు యిక్కడ సన్నిధి వారి వీధిలో ఒక యింట నిద్రిస్తున్న స్త్రీ మెడలోని గొలుసు త్రెంచుకొని పోవ ప్రయత్నిస్తుండగా పట్టుబడినాడు. నగరోటి పోలీసువారికి స్వాధీనపరచగా ఇన్‌స్పెక్టరు యం. గంగరాజుగారు అరెస్టుచేసి రిమాండులో నుంచారు.

తేరువీధిలో ఎ. వీరరాఘవయ్యగారి యింట్లో చోరీకి గూడా ఇతనే కారకుడని చెప్పబడుచున్నది.

## భీమవరంలో ఒకని అరెస్టు

భీమవరం, అక్టోబరు 6: ఒక చాకలివాడు ఎవినిచెక్కి బాలికను 8 వ తేదీ రాత్రి స్నానానికి తీసుకుపోయి, చంపి చెరువులోనుంచి కాజెయ్యాలని ప్రయత్నిస్తుండగా, రోడ్డుమీదపోయే ప్రజలు బాలికను రక్షించి, అతనిని మున్సిపల్ చైర్మన్ ఎస్. వెంకట్రామయ్యగారి ముందుకు తీసుకువచ్చారు. పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ వి. రామచంద్రుడుగారు వచ్చి, అతనిని అరెస్టు చేశారు. పోలీసులు కేసును దర్యాప్తు చేస్తున్నారు. (స్వ. వి.)

# గన్నవరంలో విమానాలు ఆగే ఏర్పాట్లు

## కాళేశ్వరరావుగారికి జగ్జీవనరాం లేఖ

విజయవాడ, అక్టోబరు 7: కలకత్తా - బెంగుళూరు, మద్రాసు - ఢిల్లీ విమాన యానంలో విజయవాడను చేర్చే విషయం తిరిగి పరిశీలన చేస్తున్నామని కేంద్రమంత్రి జగ్జీవన్ రామ్‌గారు ఒక లేఖలో విశాలాంధ్ర మహాసభ అధ్యక్షులు ఏ. కాళేశ్వరరావుగారికి తెలియజేశారు.

1953 ఎయిర్ కార్పొరేషన్సు చట్టం ప్రకారం వ్యాపారసూత్రాల మీద కార్పొరేషను పనిచెయ్యాలనీ, అందువల్ల కొత్త సర్వీసులు ఏర్పడితే, కార్పొరేషన్‌కు నష్టం రాకుండా ఉండాలని అనుకోవటం సహజమేననీ వివరించారు.

కలకత్తా - బెంగుళూరు మధ్యతిరిగే విమానాలు 1954 అక్టోబరు 1 వ తేదీ నుంచి రోజూ ఒక్కసారి విశాఖపట్టణం విమానాశ్రయంలో ఆగటానికి అన్ని ఏర్పాట్లు ఇదివరకే చేయబడ్డవని పేర్కొన్నారు.

వివిధ సంస్థలనుంచి విజ్ఞప్తులను పంపుతూ, కాళేశ్వరరావుగారు గత సెప్టెంబరు 6 వ తేదీన రవాణా శాఖ మంత్రికి ఒక లేఖ వ్రాశారు.

## గ్రామ కాంగ్రెసు సంఘ ఎన్నికలు

భీమవరం, అక్టోబరు 4: భీమవరం తాలూకాలో ఈ క్రింది గ్రామ కాంగ్రెసు ఎన్నికలుజరిపి సంఘాలు ఏర్పాటుచేశారు. 1. వీరవాసరం: అధ్యక్షులు శ్రీ గుద్దటి నరశింహమూర్తిగారు, ప్ర. కార్యదర్శి శ్రీ నిమ్మల అప్పారావుగారు, స. కార్యదర్శి శ్రీ నవరం అర్జునుడుగారు, సభ్యులు శ్రీ రావిపాటిగారు, శ్రీ బోను నరశింహమూర్తిగార్లు. 2. శృంగవృక్షం: అధ్యక్షులు శ్రీ సాగి సర్రాజుగారు, ప్ర. కార్యదర్శి తోట కోటిలరావుగారు, స. కార్యదర్శి శ్రీ కొటికలపూడి అప్పారావుగారు సభ్యులుగా శ్రీ దుండి పెద్దులు, శ్రీ పాలా నరశింహమూర్తి, శ్రీ దండు నరశింహరాజు, శ్రీ కలిదిండి నారాయణరాజు, శ్రీ నల్లపరాజు నారాయణ రాజు, శ్రీ గంగునేని వెంకన్నగార్లు. 3. పాందువ్వ: అధ్యక్షులు శ్రీ వేగేశ్న కనకదుర్గ వెంకటనారాయణరాజుగారు, కార్యదర్శి శ్రీ వేగేశ్న సూర్యరాజుగారు, సభ్యులుగా శ్రీ పెన్మత్స వెంకట్రాజు, శ్రీ గొట్టిముక్కల వెంకటపతిరాజు, శ్రీ మంతెన సూర్యరాజు, శ్రీ దాగారపు తాతయ్య, శ్రీ దుంపల మసలయ్యగార్లు. 4. ఉప్పలూరు: అధ్యక్షులు శ్రీ యర్రా చంద్రరావుగారు, కార్యదర్శి యర్రా చంద్రయ్యగారు, స. కార్యదర్శి శ్రీ గంధం రామారావుగారు, సభ్యులు శ్రీ యర్రా శ్రీరాములు, శ్రీ యర్రా ఆదినారాయణరావు, శ్రీ యర్రా సుబ్బారాయుడు, శ్రీ యర్రా రామావతారం, శ్రీ నిమ్మల సుబ్బారాయుడు, శ్రీ గంధ సత్యనారాయణమూర్తిగార్లు.

## గిద్దలూరు ప్రాంతంలో రోడ్ల అభివృద్ధి

గిద్దలూరు, సెప్టెంబరు 26: పిడతల రంగారెడ్డి, తాలూకా కాంగ్రెసు ఆర్గనైజింగ్ కార్యదర్శి కె. వెంకటరెడ్డి, డి. వేమారెడ్డి, ఎల్లా కృష్ణమూర్తిగారలు కొంగలవీడు, చంద్రారెడ్డిపల్లి, బయనపల్లి గ్రామాలను దర్శించారు. రోడ్ల నిర్మాణంలో శ్రమ, వస్తురూపంలో ప్రజలు తోడ్పడగలమన్నారు. తాటిచెర్ల గ్రామ కాంగ్రెసువారు తమ రోడ్డుకు సగం శ్రమరూపంలో చెల్లించగలమని తెలిపారు. ఆకివీడు హరిజనులు పాయిఖానాదొడ్లను నిర్మించాలనీ, సగంఖర్చు భరించగలమన్నారు. కొత్తూరు గ్రామంలోనూ రోడ్డు, బావి వీట్లకు సగం ఖర్చు భరిస్తామని ప్రజలన్నారు. (స్వ. వి.)

## కవిరాజ్ పత్రిక ప్రారంభోత్సవం

విజయవాడ, అక్టోబరు 4: 'కవిరాజ్' పత్రికా ప్రారంభోత్సవం ముల్లెల శోభనాచల చక్రవర్తిగారి అధ్యక్షతన 1 వ తేదీన జరిగింది. డాక్టర్ డి. రంగాచార్యులుగారు సభను ప్రారంభించారు. 'కవిరాజ్' సంపాదకులు ఉరిటి సూర్యనారాయణమోహన్ గారు పెద్దలు పంపిన సందేశాలను చదివారు.

## బాపట్ల బట్టల దుకాణంలో చోరీ

బాపట్ల, అక్టోబరు 4. గతరాత్రి పెద్దబజారులోని ఒక బట్టలకొట్లో పై పెంకుటి కప్పుతొలగించి దొంగలుపడి 1500 రూ.ల విలువగల బట్టలు కొంత రొఖ్ఖం దోచుకొనిపోయారు. కొట్టు యజమాని నాగవరపు నరసింహారావుగారు యీ ఉదయం ఫిర్యాదుచేయగా పోలీసు అధికార్లు దర్యాప్తుచేస్తున్నారు. (స్వ. వి.)

## జూదరుల అరెస్టు

చెరకుపల్లి, అక్టోబరు 4: రేపల్లె తాలూకా ఆరేపల్లెఅగ్రహారంలో 1 వ తేదీ రాత్రి ఏబ్బులో చీట్లపేక ఆడుతున్న ముగ్గురిని చెరకుపల్లి పోలీసువారు అరెస్టుచేశారు. ఆ సందర్భంలో 64-2-0 ఏబ్బు కూడా పోలీసువారు స్వాధీనం చేసుకొన్నారు.

అరెస్టు అయినవారిని జామీనుపై విడుదల చేశారు. (స్వ. వి.)

# కృషికర్ లోక్ పార్టీ అనుసరిస్తున్న విధానం

## శ్రీకాకుళం సభలో నిరసన: లచ్చన్నగారు కాంగ్రెస్‌లో చేరాలని విజ్ఞప్తి

(ఆంధ్రపత్రిక విలేఖరి)

శ్రీకాకుళం, అక్టోబరు 4: గాంధీజీ జయంతినాడు శ్రీకాకుళం జిల్లా కాంగ్రెసు సంఘంవారు ఇక్కడ ఏర్పాటుచేసిన సభలో ఆంధ్ర దేశంలో కృషికర్ లోక్ పార్టీవారు అవలంబిస్తున్న వైఖరిని నిరసిస్తూ పలువురు ప్రసంగించారు. నెహ్రూ ప్రభుత్వం గాంధేయ విధానానుసారంగా దేశంలో చేస్తున్న మహత్తర నిర్మాణ కార్యక్రమ కృషిని వివరిస్తూ గాంధీజీ నాయకత్వం క్రింద మనం ఏర్పరచుకొన్న జాతీయ పతాకను నిలుపుకోవటానికి, ఆ పతాక నీడన ప్రజలను సుఖోపేతులుగా చేయటానికి దేశంలోని అన్ని వర్గాలవారి సమైక్యకృషి అవసరమని ఉద్బోధించారు.

సిరిపురం గ్రామ కాపురస్థులు శ్రీ కర్రికృష్ణన్నాయుడు గారి ఆహ్వానంపై శ్రీకాకుళంజిల్లా కాంగ్రెసువారు ఈ సభ ఏర్పాటుచేశారు. పరిసర గ్రామాలనుంచి 10 వేల మంది పైగా ప్రజలు హాజరైనారు. ఊరేగింపు అనంతరం జరిగిన ఈ సభకు శ్రీకాకుళం పట్టణ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ చల్లా నరసింహంగారు అధ్యక్షత వహించారు. వచ్చిన జిల్లా కాంగ్రెసు నాయకులకు పాలకొండ తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పైడి నరసింహ అప్పారావు గారు స్వాగతం చెప్పారు.

సభను ప్రారంభిస్తూ ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ బెండి కూర్మన్నగారు గాంధీమహాత్ముని సిద్ధాంతాలకు కాంగ్రెసుసంస్థ కార్యక్షేత్రం అని చెప్పారు. స్వాతంత్ర్య సంపాదనానంతరం కాంగ్రెసు ప్రభుత్వ పీఠం నుంచి ఎంత మహత్తరకృషి చేసిందో ఆయన సమీక్షించారు. ఒక్క పంచవర్ష ప్రణాళికలోనే ఎంత అభ్యుదయం సాధించిందో నిరూపిస్తూ శ్రీ కూర్మన్నగారు "ఇంత అల్పకాలంలో ఇంతటి అభివృద్ధి సాధించిన నెహ్రూజీ ప్రభుత్వాన్ని బలపరచటం ప్రతి ఒక్కని విధ్యుక్త ధర్మంకాదా?" అని ప్రశ్నించారు.

శాసనసభ్యులు శ్రీ కూనిశెట్టి వెంకటనారాయణగారు పతాకా విష్కరణంచేస్తు భారతదేశ కీర్తిప్రతిష్ఠలు ఈ పతాకం ద్వారా యావత్ప్రపంచానా వ్యాపించినాయని పేర్కొన్నారు. ప్రభుత్వంవారి జనాభ్యుదయ కార్యక్రమాలను వివరించి శ్రీ దొరగారు ఒకప్రక్కన ప్రభుత్వం ఇటువంటి కార్యకలాపాలతో సతమతమౌతుండగా రాష్ట్రంలో అనేక రాజకీయ పక్షాలు వెలసి, అధికార సంపాదనకు ప్రాకులాడుతూ, అభ్యుదయ నిరోధకంగా ప్రవర్తించటం తగదని విమర్శించారు. తాము కృషికర్ లోక్ పార్టీలో కొంత కాలం సభ్యులుగా ఉండటంగురించి ప్రస్తావించి, ఆ పార్టీవారు మొదట కాంగ్రెసువారికంటే ఉత్తమ నియమావళి ఏర్పాటుచేసి, ఆదర్శవంతమైన కార్యక్రమాన్ని అమలుజరిపేటట్లు కనిపించారుకాని తరువాత తరువాత పార్టీ ద్వంద్వ విధానం అవలంబించి రాజధాని హైకోర్టుల విషయంలో అనుచితవైఖరి అవలంబించటంచేత తాము ఆ పార్టీని విడిచిపెట్టామని ఆయన వివరించారు. కె. యల్. పి. లో మంత్రిపదవికి అర్హుడైన శ్రీ తిమ్మారెడ్డిగారికి ఆ పదవి ఇవ్వటంతో శ్రీ లచ్చన్నగారు రంగు ఫిరాయించారనీ పేదల పాలిటి పిశాచమైన మద్యపానాన్ని పునరుద్ధరించటానికి సత్యాగ్రహం ఆరంభించి తను అక్కసును సభలలో పత్యుతి పాటించుకుండా వాక్స్వాతంత్ర్య మున్నదికదా అని మాట్లాడుతున్నారని కూడా శ్రీ శెట్టి దొరగారు చెప్పారు. ప్రజలందరు ఇట్టి నాయకుల దుష్ప్రచారాలకులోను గాక జాతీయపతాక రక్షణకు ఏకం కావాలని ఉద్బోధించారు.

తరువాత శ్రీ లక్ష్మణనాయుడుగారు ప్రసంగిస్తూ కృషికర్ లోక్ పార్టీవారు నడుపుతున్న గీత సత్యాగ్రహాన్ని విమర్శించారు. శ్రీ పాపారావుగారు ఇతర దేశాలు స్వాతంత్ర్య సిద్ధ్యనంతరం అనేక శ్రమలు పడవలసి వచ్చినాయని భారతదేశం వాటికంటే చాలా నయమని, కాంగ్రెసు ప్రభుత్వ కృషే ఇందుకు కారణమని వివరించారు. చిల్లర చిల్లర పార్టీల వలన దేశక్షేమం భంగపడటం తప్ప మరి ప్రయోజనం ఉండదంటూ అటువంటి బాధ్యతారహిత స్వేచ్ఛాయుత వైఖరి నవలంబించేవర్గాలకు ప్రజలు నీతి నేర్పాలని విజ్ఞప్తి చేశారు.

తరువాత శ్రీ కోటగిరి సీతారామస్వామిగారు ఉపన్యసిస్తూ కృషికర్ లోక్ పార్టీవారు ఇక మీదనైనా కాంగ్రెసులో చేరి జనసేవ చేయాలని విజ్ఞప్తిచేశారు. లచ్చన్నగారు తిరిగి కాంగ్రెసులో చేరి తమ శక్తియుక్తులను కాంగ్రెసు ద్వారా ప్రజల శ్రేయస్సుకు జాతి భవిష్యత్తుకు అంకితం చేయాలని కూడా ఆయన కోరారు. ప్రస్తుతం ఆపార్టీవారు చేస్తున్న పనులను గురించి మాటాడుతూ "అంతిగా ఆపార్టీవారు కావాలనుకుంటే వచ్చే ఎన్నికలలో తమపార్టీ సిద్ధాంతాలను ఏమైనా ఉంటే ప్రజలకు క్రమబద్ధమైన ప్రచారము ద్వారా తెలిపి నోటు చేయాలి కాని ఆకర్షణ వంటిమైన నినాదాలతో ప్రజలను మభ్య పెట్టరాదని కూడా ఆయన హెచ్చరించారు.

# గుంటూరులో హరిజన వారోత్సవం

(స్వకీయ విలేఖరి)

గుంటూరు, అక్టోబరు 5: హరిజన వారోత్సవము యిచట సెప్టెంబరు 24 నుండి అక్టోబరు 2 వ తారీఖు వరకు గుంటూరు పట్టణంలోను పేరేచర్ల గ్రామంలోను జయప్రదంగా నిర్వహింప బడినది. ఈ ఉత్సవం ప్రముఖుల సంఘ అధ్వర్యాన జరిగింది. 28-9-54 న కృష్ణాశ్రమ విద్యార్థులతో ఊరేగింపు జరిగింది. 29-9-54, 30-9-54, 1-10-54 తేదీలలో పురపాలక సంఘ సభ్యులైన శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్యగారి ఆధిపత్యము క్రింద రెల్లీ కాలనీ, పాతూరి వారి తోట, కొండపాడు, పిచ్చికల గుంట వద్ద హరిజన వాడలలో పారిశుద్ధ్యం కార్యక్రమం జరుపబడింది. కృష్ణాశ్రమ విద్యార్థులు 39 మంది, ఆశ్రమ మేనేజరు శ్రీ ముత్యాలు, నావివాల సూర్యం, ఆంధ్రరాష్ట్ర హరిజన సేవక సంఘ కార్యకర్తలు, మేనేజరు వెంకటదాసు, శ్రీ దిడుగు కైలాసపతిగారు యీ కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొన్నారు. మున్సిపల్ హెల్తు ఆఫీసరు తన సిబ్బంది పనిముట్లతో సహాయపడ్డారు. పశ్చిమ గోదావరిజిల్లా హరిజనులు శ్రీ వడ్డి వెంకట శివరావు, శ్రీ నేతి వెంకట చలపతి (ఆంధ్రరాష్ట్ర హరిజన సేవక సంఘ కార్యదర్శి), రిటైర్డు హెడ్ మాస్టరు శ్రీ జోసెఫ్, డా॥ సుశీలాదేవి యీ ఉత్సవంలో పాల్గొన్నారు. హరిజన వాడలలో మురుగు కాల్వల త్రవ్వి 1½ ఫర్లాంగులు రోడ్డు వేశారు.

శ్రీ జోసెఫ్‌గారి యింట్లో 1 వ తేదీన జరిగిన అల్పాహారవిందు కార్యక్రమంలో అన్ని కులస్థులవారు పాల్గొన్నారు.

ఈ కార్యక్రమ మంతయు హరిజనులకు ఎంతో ఉత్సాహం కలిగించింది. గుంటూరు పురపాలక సంఘమువారు తోలిన 8 బండ్ల కంకరతో పై మట్టి రోడ్డు కంకర రోడ్డుగా తయారయింది. ఈ ఉత్సవం ఖర్చు క్రింద జిల్లా కలెక్టరు గారు రు 100/- గ్రాంటు మంజూరు చేశారు.

గాంధి పార్కులో శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్యగారి అధ్యక్షతన 2 వ తేదీన బహిరంగసభ జరిగింది. శ్రీయుతులు వడ్డి వెంకట శివరావు, పాలపర్తి నరసింహం, నేతి వెంకట చలపతి, ముత్యాలు, బి. వెంకటదాసు, కైలాసపతి, గారలు ప్రసంగించారు. కృష్ణాశ్రమ విద్యార్థులకు బహుమతులుగా సబ్బు బిళ్లలు యివ్వబడ్డాయి. పిల్లలకు పిప్పరమెంట్లు పంచారు.

పేరేచర్ల గ్రామంలో 1 వ తేదీన గురుకుల విద్యావనంలో ఆటల పోటీలు జరిపారు. వరదరాజ స్వామివారి ఆలయములో హరిజన ప్రవేశం జరిగింది. గురుకుల విద్యావనంలో జిల్లా కలెక్టరు శ్రీ యస్. రమేశన్ గారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. శ్రీయుతులు నేతి వెంకటాచలపతి, డా॥ పరుచూరి వీరయ్యచౌదరి, మాడభూషి నరసింహాచార్యులు, గుంటూరు పురపాలకసంఘ సభ్యులు తిరుపతయ్య, నారాయణ గారలు ప్రసంగించారు.

పోటీలలో విజయం పొందినవారికి జిల్లా విద్యాశాఖాధికారిచే బహుమతి ప్రదానం చేయబడింది. ఈ కార్యక్రమం గురుకుల విద్యావన కార్యదర్శి శ్రీ జి. వి. పున్నయ్యశాస్త్రి, ప్రధానోపాధ్యాయులు శ్రీ తెలికచర్ల సూర్యప్రకాశం గార్లచే ఏర్పాటు చేయబడింది.

## తెనాలి కళాశాల కొత్త కమిటీ

తెనాలి, అక్టోబరు 5: తెనాలి కళాశాల సర్వసభ్యసమావేశం గొగినేని రంగనాయకులు చౌదరిగారి అధ్యక్షతన కళాశాలాహాలులో ఈరోజున జరిగింది. కొత్త నిబంధనావళి ప్రకారం మేనేజింగుకమిటీకి 25 మంది సభ్యులను ఎన్నుకున్నారు. మేనేజింగుకమిటీ పాలకవర్గాన్ని ఈనెల 14 వ తేదీన ఎన్నుకుంటుంది.

కార్యదర్శి ఎస్. వెంకటరావుగారు ప్రవేశపెట్టిన పరిపాలనా నివేదికను, ఆడిట్ రిపోర్టును ఆమోదించారు.

కొంగంటి కోటయ్య, డాక్టర్ ఏ. కృష్ణమూర్తి, అవుకు రామిరెడ్డిగారల మృతికి సానుభూతిని తెలియజేశారు. తెలుగుపండితులు వఝ్ఝల వెంకటరత్నంగారి మృతికికూడా సానుభూతిని తెలియజేస్తూ తీర్మానించారు. (స్వ. వి.)

# ఉపాధ్యాయుల కర్తవ్యం

## హిందూ కళాశాల ప్రిన్సిపాల్ వివరణ

గుంటూరు, అక్టోబరు 5: ఆంధ్ర క్రైస్తవ కళాశాల బి. ఇ. డి. విద్యార్థుల పారశిక్షణ శిబిర అంత్యోత్సవం హోప్‌వుడ్ భవనంలో శ్రీ హోప్‌వుడ్ గారి అధ్యక్షతన జరిగింది. తేనీటి విందు అయిన తరువాత శ్రీ యస్. యన్. సుందరంగారి ప్రార్థనతో కార్యక్రమం ప్రారంభమయింది. శ్రీ హోప్‌వుడ్ గారు శిక్షణపొందుతున్న వారలకు యోగ్యతాపత్రాలను పంచిపెట్టారు.

హిందూకళాశాల ప్రిన్సిపాలు శ్రీ వల్లభి జోస్యుల సుబ్బారావుగారు ఉపాధ్యాయులుగాని, విద్యార్థులో గాని తమ విధ్యుక్తధర్మ నిర్వహణలు శ్రద్ధమాపుటలేదని తత్ఫలితంగా విద్యాస్థాయి నానాటికి దిగజారిపోతున్నదని ఉపాధ్యాయులు నెలతిరగంగానే జీతాలు తీసుకోటంలో తృప్తిపడక వారి పనిలో ఉత్సాహం చూపి సంతోషం, సంతృప్తి చెందాలనీ, వారి దినచర్యఅయిన తరువాత గృహోన్ముఖులై వెళ్ళేటప్పుడు వారు వికారముఖముల ప్రదర్శించకూడదనీ, విద్యభవిష్యత్తంతా వారి చేతుల్లోనే వుంది. కనుక విద్యవిషయంలో వారు నిజమైన శ్రద్ధచూపాలనీ అన్నారు. విద్యార్థులు కూడ మురికిప్రాంతములను శుభ్రపరుచుటలో ఎక్కువ శ్రద్ధచూపాలని ప్రబోధించారు.

శ్రీ ఎ. కోటయ్యచౌదరి గారి వందన సమర్పణతో సభ ముగిసింది.

## జిల్లా కాంగ్రెసు సంఘ కార్యవర్గ సమావేశం

శ్రీకాకుళం, అక్టోబరు 4: శ్రీకాకుళంజిల్లా కాంగ్రెసు సంఘ కార్యవర్గ సమావేశం మధ్యాహ్నం 2 గంటలకు సిరిపురంలో జరిగింది. శ్రీ కె. సీతారామస్వామిగారు అధ్యక్షతవహించారు.

మద్దూరి అన్నపూర్ణయ్యగారి మృతికి సంతాపం తెలిపిన పిదప శ్రీ ఆర్. లక్ష్మనరసింహం, తదితర పూర్వ కాంగ్రెసు సభ్యులను తిరిగి కాంగ్రెసులో చేరవలసిందిగా కోరుతూ ఒక తీర్మానం చేశారు. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి జిల్లా పర్యటనకు కార్యక్రమం నిర్ణయించారు.

జిల్లా కాంగ్రెసు నిధికి విరాళాలు పోగుచేస్తున్న శ్రీకాకుళం పట్టణ కాంగ్రెసు సంఘాన్ని అభినందించారు. శ్రీ కె. రంగనాధం పాతక్ గారిని జిల్లా ఎన్నిక అధికారిగా సూచించారు. శ్రీ కూనిశెట్టి వెంకటనారాయణదొరగారిని జిల్లా కాంగ్రెసు కార్యవర్గ సభ్యులుగా చేర్చుకుంటూ సవాలిన కాంగ్రెసు వాదుల జాబితా తయారు చేసేటందుకు శ్రీ గరిమెళ్ళ కుమారస్వామిగారికి అధికారం ఇచ్చారు.

## చీరాల రోటరీక్లబ్

చీరాల, అక్టోబరు 5: నిన్న సాయంకాలం చీరాల రోటరీక్లబ్ సమావేశం. రొటేరియన్ శ్రీ యార్లగడ్డ రామనాథం బాబు చౌదరిగారి అధ్యక్షతనుజరిగి, రొటేరియన్. శ్రీ దాశరం వైద్యనాథం నాయుడుగారి భార్య అన సూర్యమ్మగారు గతివారంలో మరణించినందువల్ల క్లబ్ వారి సానుభూతిని వైద్యనాథంనాయుడుగారికి అందిజేస్తూ తీర్మానించారు.

## ఏటికొప్పాక కార్మికుల సమ్మె

యలమంచిలి, అక్టోబరు 6: ఏటికొప్పాక పంచదార ఫ్యాక్టరీలోని 700 మంది కార్మికులు నిన్నటినుంచీ సమ్మె ప్రారంభించినట్లు, కార్మిక యూనియన్ అధ్యక్షుడు శ్రీ కె. ఎస్. శాస్త్రి గారు తెలుపుతున్నారు.

పనినుండి తొలగించిన యూనియన్ ఉపాధ్యక్షుణ్ణి మరో 41 మంది కార్మికులను తిరిగి పనిలో చేర్చుకోవాలని, ప్రావిడెంటుఫండు సౌకర్యాన్ని కల్గించాలని, బోనసు యివ్వాలని, వాచ్ అండ్ వార్డు సెక్షన్‌కు పనివాళ్ళకు వారానికి ఒక శెలవు యివ్వాలని, అదనపుపనికి అదనంగా డబ్బు యివ్వాలని కార్మికుల కోర్కెలు.

## విజయవాడ పి. ఎస్. పి. సభ్యుని రాజీనామా

విజయవాడ, అక్టోబరు 4: ప్రజా సోషలిస్టుపార్టీ సభ్యత్వానికి రాజీనామా నిస్తూ విజయవాడ పురపాలకసంఘ ప్రజా సోషలిస్టుపార్టీ నాయకుడు జనాబ్ ఖుద్దూస్ గారు నేడొక ప్రకటన చేశారు. కరిజన సత్యాగ్రహం పార్టీ ప్రాథమిక సంఘాలను సంప్రతించి ప్రారంభించబలేదని, పార్టీ నాయకత్వం నియంతృత్వ పంథాను అవలంబిస్తున్నదని జనాబ్ ఖుద్దూస్ తమ రాజీనామా లేఖలో పేర్కొన్నారు. (స్వ. వి.)

## అల్పాహారవిందు

పసుమర్తి గ్రామకాపురస్థులు శ్రీ మద్ది లక్ష్మయ్య, బి. ఇ. గారు విదేశాలలో సాగాకు పరిశ్రమను పరిశీలించుటకుగాను ఇంగ్లండుకు వెళ్లుచున్న సందర్భంలో ఈ వూరి మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ తిమ్మవర్తి బసవయ్యశ్రేష్ఠి గారు తమయింట నిన్న సాయంకాలం అల్పాహారవిందుచేశారు. వి. ఆర్. యస్. కళాశాల ప్రిన్సిపాల్ డాక్టరు టి. రామారావుగారి అధ్యక్షతన వీడ్కోలు ఉపన్యాససభ జరిగింది.

# గాంధీ జయంతి

### పెనుగొండ

ఇక్కడి హరిజన హాస్టలు ఆవరణలో జరిగిన గాంధీ జయంతి సభకు శ్రీ జవ్వాది రంగారావునాయుడు జమీందారుగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు ఎం. హుస్సేన్‌సాహెబ్ పి. వి. సుబ్బయ్య, శామ్యూలు జోయబ్ గారలు ఉపన్యసించారు. శ్రీ జి కృపాలినీగారు ఆటల పోటీలు నిర్వహించారు.

### కొలకెన్ను

గాంధీ జయంత్యుత్సవంనాడు గ్రామపంచాయతీవారు గాంధీజీ ఆశయాలను అనుసరించి నడుపుతున్న వయోజన విద్యాపాఠశాల ద్వితీయ వార్షికోత్సవం కూడా జరిపారు. హరిజనవాడలో జరిగిన బహిరంగ సభలో శ్రీయుతులు ఎ. భాస్కరరావు, పి. మధుసూదనరావు, కె. లక్ష్మీనారాయణ, యం. పరంధామయ్య, వై. వి. సుబ్బయ్య, జోసెఫ్ గారలు పాల్గొన్నారు. గాంధీజీ విగ్రహంవద్ద శ్రీ వై. వెంకటసుబ్బయ్యగారు జండా ప్రతిష్ఠాపన జరిపారు.

### రాజోలు

తాలూకా కాంగ్రెసు వారు ఇక్కడ జయంత్యుత్సవం జరిపారు. శ్రీ వి. కామేశ్వరరావుగారు అధ్యక్షతవహించారు. శ్రీయుతులు యం. విశ్వనాథం కె. రామచంద్రరావు, డి. శ్రీ రామచంద్రమూర్తి, యం. వి. సీతారామయ్య, పి. సూర్యనారాయణగారలు ప్రసంగించారు.

### మాచర్ల

గాంధీజీ చిత్రం గ్రామవీధుల్లో వూరేగించబడింది. ఫలహారాలు పంచబడ్డాయి. పంచాయితీ బోర్డువారు శ్రీ కె. గోపాలస్వామిగారు వుత్సవంజయప్రదంగా నిర్వహించారు.

### రాజమండ్రి

గాంధీజీ జయంత్యుత్సవ సందర్భంలో శ్రీ విక్రమహాలులో లలితకళారాధన, సరస్వతీ పూజలు జరిగినాయి. శాసనసభ ఉపాధ్యక్షులు శ్రీ వసల సూర్యచంద్రరావుగారు అధ్యక్షత వహించారు. కుమారి కాంతాదేవి వీణావాయిద్యం, పిదప పండితుల కావ్యపఠనం ఏర్పాటు చేయబడ్డాయి. శ్రీయుతులు ఎ. మల్లికార్జునరావు, యం. సత్యనారాయణశాస్త్రి, నండూరి బంగారయ్య శ్రీమతి బి. కామాక్షమ్మగారలు పాల్గొన్నారు. కుమారి దేవతలక్ష్మి, కాంతాదేవిగారలకు రజిత పత్రాలు గృహపరిశ్రమ ఉత్పత్తులను విక్రయించిన దేవత సూర్యకాంతమ్మగారలకు కాలువా బహూకరించారు.

### కైకలూరు

గాంధీజీ జన్మదినోత్సవ సందర్భంలో ఇక్కడ ఊరేగింపు జరిగింది. మధ్యాహ్నం ఆటలపోటీలు జరిగినాయి. శ్రీ పి. వంకటేశ్వరరావుగారి అధ్యక్షతన జరిగిన బహిరంగసభలో శ్రీయుతులు కె. పురుషోత్తం, ఐ. వరసయ్య, యం. సీతాపతిరావుగారలు పాల్గొన్నారు. శ్రీ వి. నరసింహమూర్తిగారు వందనాలు చెప్పారు.

### కావులపాలెం

బాపూజీ జయంతినాడు ఇక్కడ ప్రభాత్ ఫేరీ ఏర్పాటు చేయబడింది. బహిరంగసభకు జె. సుందరరామచంద్రరావుగారు అధ్యక్షత వహించారు. పలువురు ప్రసంగించారు. రాత్రి తోలుబొమ్మలాట ప్రదర్శించబడింది.

### ఇల్లెందు

జయంత్యుత్సవ సందర్భంలో శ్రీ పార్థసారథి గారు ఉదయం పతాకావిష్కరణం జరిపారు. సాయంత్రం జరిగిన బహిరంగసభలో శ్రీ పి. వెంకన్నగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు యస్. వి. యల్. నరసింహారావు, పి. దుర్గాప్రసాదరావు, కె. సాంబశివశాస్త్రి, డి. ఆర్. దుర్గాలాల్, మోహన్‌రావుగారలు పాల్గొన్నారు.

### కారేపల్లి

స్థానిక భారత యువజన గ్రంథాలయంలో బాపూజీ జన్మదినోత్సవం నాడు శ్రీ వి. రామలింగంగుప్తగారు జండా ఎగురవేశారు. సాయంత్రం శ్రీ నారాయణరావుగారి అధ్యక్షతనజరిగిన సభలో శ్రీయుతులు రామలింగం, మాధవరావు, పీటర్సు, తోట నారాయణ మొదలగువారు పాల్గొన్నారు.

### పత్తికొండ

గాంధీజయంతినాడు ఇక్కడ 600 మంది హరిజనులకు అన్నదానం జరిగింది. తహశీల్‌దారు శ్రీ షాకరు సాహెబుగారు యాజమాన్యం వహించారు. సబుమేజిస్ట్రేట్ శ్రీ విశ్వేశ్వరయ్యగారు హరిజనులకు గాంధీజీచేసిన సేవనుగురించి వివరించారు.

### యస్. ఉప్పలపాడు

నేతాజీ విద్యార్థిక్లబ్బువారు జరిపిన గాంధీజయంత్యుత్సవాలలో శ్రీయుతులు పి. ఆర్. భరద్వాజ్, యిండెబ్బారెడ్డి, డి. బి. విలియమ్సు కవిగారలు పాల్గొన్నారు. గ్రామపారిశుద్ధ్యం జరిగింది. రాత్రి రోషన్‌సాహెబ్ బుర్రకథ వారు కథచెప్పారు.

### మంగళగిరి

ఇక్కడి గాంధీజయంతి ఉత్సవాలలో కె. పున్నయ్యగారు హరిజన హాస్టలులో ఫలహారాలు పంచినారు. శ్రీ ఓ. శివరామకృష్ణారెడ్డిగారి అధ్యక్షతన జరిగిన సభలో శ్రీయుతులు వై. కోటయ్య, ఎ. వి. రామారావు కె. వెంకటరత్నం, యస్. నాగేశ్వరరావుగారలు ప్రసంగించారు.

### నిడదవోలు

గాంధీ జయంతినాడు పట్టణ కాంగ్రెసు సభ్యులు కార్యాలయంలో ప్రార్థనలు జరిపారు. మహిళాసంఘం అధ్వర్యాన గాంధీ విహారులో సూత్రయజ్ఞం జరిపారు. శ్రీమతి చర్ల సుశీలమ్మగారు గాంధీజీ జీవితచరిత్రను గురించి ఉపన్యసించారు.

### సోంపేట

గాంధీ జయంతి సందర్భంలో ఇక్కడ ఉత్తర విశాఖ సర్వోదయ సహాయక సమితి బ్రాంచి తెరిచారు. శ్రీ పి. సుబ్బారావుగారు సూత్రయజ్ఞం జరిపారు.

### శృంగవరపుకోట

గాంధీజీ జయంతి సందర్భంలో స్థానిక అధికారుల క్లబ్బును శ్రీ యస్. పైడితల్లిగారు ప్రారంభోత్సవం జరిపారు. శ్రీ యం. గౌరినాయుడుగారు అధ్యక్షతవహించారు. తహశీల్ దారు శ్రీ మార్కండేయగారి ప్రసంగం తరువాత శ్రీయుతులు చుండూరి పట్టాభి రామయ్య, ఎ. అప్పారావు, టి. నరసింహారావు గారలు యస్. జి. కిల దుర్భరపరిస్థితులను వివరించారు. శ్రీ గాలి మీనాశ్రాస్త్రి గారువందనసమర్పణచేశారు.

### ఇచ్ఛాపురం

గాంధీజీ చిత్రపటం ఊరేగింపు జరపబడింది. శ్రీ బి. కె. వి. జగన్నాధంగారు అధ్యక్షత వహించారు. పిల్లలకు మిఠాయిలు పంచబడ్డాయి.

### చిట్యాల

గాంధీ విగ్రహం ఊరేగింపబడింది. శ్రీ టి. వెంకటరత్నంగారు జండా ప్రతిష్ఠించారు. శ్రీ జి. సుబ్బారావుగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది. శ్రీయుతులు నండూరి రామారావు జి. ఆనందరావుగారలు కూడా పాల్గొన్నారు.

# నూజివీడు ఉపాధ్యాయునికి శిక్ష

బందరు, అక్టోబరు 5: నూజివీడు మిషన్‌స్కూలు మాజీఉపాధ్యాయుడు శ్రీ పెందుర్తి దేవమందిరం యిక్కడ నిరాహారదీక్ష పూనిన సందర్భంలో యిటీవల ఆయన కలెక్టరుగారి ఆఫీసు భవనంలో ప్రవేశించగా రాబర్టుసన్ పేట పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు బి. ఎల్. ఆచారిగారు ఐ. పి. సి. 447 సెక్షన్ క్రింద అరెస్టుచేసి కేసుపెట్టారు. స్థానిక సబ్ మేజిస్ట్రేటు పి. రామకోటయ్య గారు ముద్దాయి నేరంచేశాడని నిర్ణయించి ఆరువారాలు శిక్ష విధించారు. ఆయనను ఆలీపూరు జైలుకు పంపారు.

# కదిరికి విద్యుచ్ఛక్తి సప్లయి ప్రారంభం

కదిరి, అక్టోబరు 2: ఇక్కడ విద్యుచ్ఛక్తికి శ్రీ కె. వి. వేమారెడ్డిగారు ప్రారంభం చేశారు. నేను వినయా టాకీసులో జరిగిన సభలో ఆయన మీటనొక్కి దీపం వెలిగించారు. సభకు శ్రీ కల్లూరి సుబ్బారావుగారు అధ్యక్షత వహించి ఈ విద్యుచ్ఛక్తి ఉపయోగాలను వివరించారు. విద్యుచ్ఛక్తిసరఫరా ప్రధానోద్యోగులు ఉపయోగాలను వివరించారు.

# క్రీడారంగం

## బొంబై ఫుట్‌బాల్‌లో విశాఖపట్నం గెలుపు

### డైనమో జట్టుపై 3 గోలులతో గెలుపు

బొంబాయి, అక్టోబరు 7: ఇక్కడ కూపరేజ్ గ్రవుండ్సులో జరుగుతున్న రోవర్స్ కప్ ఫుట్‌బాల్ టూర్నమెంటులో ఈ వేళ విశాఖపట్నం స్పోర్ట్సు మెన్సు క్లబ్బు డైనమో క్లబ్ మీద ఘన విజయం సాధించింది (3-0). విశాఖపట్నం సాధించిన 3 గోలుల్నీ సెంటర్ ఫార్వర్డు బాపిరాజు ఒక్కడూ చేశాడు. శేషగిరిరావు (రైట్ ఇన్), హనుమంతు (లెఫ్టఅవుట్) అన్ని విధాలా అతనికి తోడ్పడ్డారు.

మొదటి సగంలో ఒకగోలు, రెండవ సగం చివరలో మిగిలిన రెండూ అయినవి. రెండవ సగం మొదట్లో బొంబై జట్టు అనేకసార్లు గోలు చేయ ప్రయత్నించగా, విశాఖ గోల్ కీపర్ రసూల్ చాలా సామర్థ్యంతో కాపాడాడు. సెంటర్ హాఫ్ అలీఫ్‌ఖాన్ ఈగోలుకాపలాలో గొప్ప అండగ నిలబడ్డాడు.

ఈ రెండు జట్లూ లోగడ ఒకసారి డ్రా చేసి ఉన్నవి. విశాఖపట్నం స్పోర్ట్సుమెన్సు క్లబ్—రసూల్ (గోలర్), మురళీ మోహన్ (హాఫ్ బ్యాక్), శేఖరం, అప్పారావు, అలీఫ్‌ఖాన్, వరహాలు, హనుమంతు, అగుల్ దాస్, బాపిరాజు, శేషగిరిరావు, రామారావు.

బొంబాయి న్యూక్లబ్‌జట్టు బర్మాషెల జట్టును ఒకగోలుతో ఓడించింది.

## మొయిన్ ఉద్దౌలా గోల్డ్‌కప్ క్రికెట్

హైదరాబాద్, అక్టోబరు 7: మొయినుద్దౌలా గోల్డుకప్ క్రికెట్ ఫైనల్సుపోటీలో రెండవ రోజయిన ఈ వేళ హైదరాబాద్ జట్టు సికందరాబాద్ జట్టును ఒక ఇన్నింగ్సుపైన 199 పరుగుల తేడాతో ఓడించింది. సికందరాబాద్ ఈ ఒక్కరోజులో రెండు ఇన్నింగ్సులోనూ అవుటయింది.

మొదటి ఇన్నింగ్సు - హైదరాబాద్ 322 (7 కి డిక్లేర్డు) (అలీహుసేన్ 126, నసీరుద్దీన్ 45, గులాం అహమద్ 24) సికంద్రాబాద్ 79, రెండవ ఇన్నింగ్సు — సికంద్రాబాద్

గులాం అహమద్ సికంద్రాబాదు మొదటి ఇన్నింగ్సులో 36 పరుగులకు 7 వికెట్లనూ, రెండవ ఇన్నింగ్సులో 19 పరుగులకు 5 వికెట్లను తీసుకున్నాడు.

## భద్రాచలం ఆటలపోటీలు

భద్రాచలం, అక్టోబర్ 8: భద్రాచలంలో ఆంధ్రరాష్ట్ర అవతరణ దినోత్సవ సందర్భంలో ఆటలపోటీలు గవర్నమెంట్ హైస్కూలు గ్రవుండ్సులో జరిగినవి. తరవాత రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్ ఎస్. వెంకటస్వామి నాయుడుగారి అధ్యక్షతన జరిగిన సభలో బహుమానాలు పంచిపెట్టబడినవి. (స్వ. వి)

## గూడూరు తాలూకా ఆటలపోటీలు

కోట, అక్టోబరు 4. ఆంధ్రరాష్ట్ర అవతరణ ప్రథమ వార్షికోత్సవమును పురస్కరించుకొని కోటగ్రామములో కోట సేవాసమితి వారు గూడూరు తాలూకా ఆటలపోటీలను నిర్వహించిరి. సదరు ఆటలపోటీలలో యీ క్రిందివారు గెలుపొందిరి.

క్యారమ్సు (సింగిల్సు): నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి (కోట).

బ్యాడ్‌మింటన్ (డబుల్సు): గూడూరు టీమ్. సైదెన్, వెంకట్రామయ్య.

బ్యాడ్‌మింటన్ (లైట్సు): కోట టీమ్. నల్లపరెడ్డి గోపాలురెడ్డి, కె ఆదిశేషారెడ్డి, అల్లారెడ్డి వెంకటకృష్ణారెడ్డి. రావూరు జనార్దనరావు, రాధాకృష్ణయ్య.

చెడుగుడు: వీర శివాజీటీమ్ (చిన్నూరు), పి. వెంకటశేషయ్య, సి. వెంకటసుబ్బయ్య, వి. రఘునాథరెడ్డి, వి. క్రిష్ణారెడ్డి, పి. రామచంద్రయ్య, టి. కోటయ్య, సి. రామయ్య.

కోటలో 1 వ తేదీ ఉదయము బాలబాలికలు జాతీయపతాకాలతో ఊరేగింపు జేసిరి. క్లబ్‌లో బాలబాలికలకు మిఠాయి పంచిపెట్టబడెను. రాత్రి 8 గంటలకు కోట సేవాసమితి అధ్యక్షుడు శ్రీ నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారి అధ్యక్షతన పెద్ద బహిరంగసభ జరిగింది. వినోద ప్రదర్శనములు ప్రేక్షకులను ఆహ్లాదపరచినవి. రామమూర్తిగారు ఉపన్యసించుచూ అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారికి జోహారు అర్పించిరి. ఆటల పోటీలలోను, వినోద ప్రదర్శనములలోను గెలుపొందినవారికి శ్రీ నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారు బహుమతులు పంచిరి. క్లబ్ మేనేజరు శ్రీ తిరుమలశెట్టి రమణయ్యగారి వందన సమర్పణముతో సభ జయప్రదముగ ముగిసెను. (ఒ. వి.)

## గుడివాడలో క్రికెట్

గుడివాడ, అక్టోబరు 5: గుడివాడలో 3 వ తారీఖున జరిగిన క్రికెటుపోటీలో గుడివాడ "ఏ టీము" "బి టీము"ను రెండు పరుగుల తేడాతో గెలిచెను. 'ఏ' టీములో గోపాలరావు బాగుగా బాట్ చేసి 60 పరుగులు సాధించినాడు. 4 వికెట్లుకూడా తీసుకున్నాడు. కృష్ణమూర్తి ఒకపరుగు పరుగు లివ్వకుండా మూడు వికెట్లు తీసుకున్నాడు. 'బి' టీములో కాశీ, రామచంద్రరావు బాగుగా బాట్ చేసి 30 పరుగులు, 42 పరుగులు సాధించారు. పార్థసారధి బాగుగా బాట్ చేసి 4 వికెట్లు తీసుకున్నాడు.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Ahdhra Partika Press, No. 7, Thambu Chetty St., Madras.

కల్యాణ గ్రామంలో ఈ నెల 8 న మంత్రి సంజీవయ్యగారు ఆరోగ్య కేంద్రానికి శంకుస్థాపన చేస్తున్న దృశ్యం.

కమ్యూనిటీ ప్రాజెక్టు ఆధ్వర్యాన తాళ్లమాపురం గ్రామంలో మాతా శిశు సంరక్షణ కేంద్రమునకు స్థాపించు మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారు ప్రారంభోత్సవం జరుపుతున్న సందర్భంలో తీసిన ఫోటో.

ఆంధ్రరాష్ట్ర ప్రథమవార్షికోత్సవసందర్భంలో విజయనగరం పురపాలక సంఘాధ్యక్షులు డా॥ బి. వి. సంజీవరావుగారు మున్సిపల్ ఓపెన్ థియేటరును ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం.

ఆంధ్రరాష్ట్ర ప్రథమవార్షికోత్సవ సందర్భంలో విజయనగరంలో బాలబాలికల క్రీడోత్సవాలు.

గాంధీ జన్మదినోత్సవ సందర్భంలో గుడివాడ కొల్లూరు 2000 మందికి అన్నదానం చేశారు.

# రాష్ట్రావతరణో త్సవాలు

## మదనపల్లి

ఆంధ్ర రాష్ట్రావతరణోత్సవం ఊరేగింపుతో ఆరంభమైంది. పంచాయితీ కార్యాలయావరణంలో సుమారు 1000 మంది బీదలకు అన్నదానం చేయబడింది. సాయంత్రం జరిగిన బహిరంగ సభలో శ్రీయుతులు యం. వి. పాపన్నగుప్త, ఆర్. నరసింహారెడ్డి, సి. రామిరెడ్డి, కలీల్ సాహెబ్ గారలు ప్రసంగించారు. విజయా కళా సంఘంవారు నాటకాలు ప్రదర్శించారు.

## ఆత్మకూరు

ఆత్మకూరు గ్రామ కాంగ్రెసు ఆధ్వర్యాన జరిగిన రాష్ట్ర వార్షికోత్సవ సందర్భంగా కంపా పున్నయ్యగారు కాంగ్రెసు ఆఫీసువద్ద జాతీయ పతాకాన్ని ఎగురవేశారు. బాలురకు మిఠాయిలు పంచిపెట్టారు.

## మంగళగిరి

మంగళగిరి పంచాయితీబోర్డు ఆఫీసు వద్ద, సి. హెచ్. కె. హైస్కూలు వద్ద జాతీయ జెండాను ఈనెల 1 వ తేదీన ఎగురవేశారు. పంచాయతీబోర్డు అధ్యక్షులు కాశంగి వెంకటరత్నంగారు బాలురకు మిఠాయిలు పంచిపెట్టారు. బాపూజీ హరిజన హాస్టల్ వద్ద ఈరోజున పట్టణ కాంగ్రెసు కార్యదర్శి గోలి వీరాంజనేయులు గారు జాతీయజెండాను ప్రతిష్ఠించారు.

## కృష్ణాయపాలెం

రాష్ట్ర ఉత్సవాల సందర్భంగా ఇక్కడ మేడికొండ గోపాలకృష్ణమూర్తి గారు జెండాను ప్రతిష్ఠించారు. సర్వోదయ కార్యకర్తలు పుట్టా సుబ్బారావు, ప్రతి శేషయ్యగారలు పాల్గొన్నారు.

## ద్రాక్షారామ

ద్రాక్షారామలో రాష్ట్రవార్షికోత్సవ సందర్భంగా ఉదయం బాలబాలికలచే నగర సంకీర్తన చేయబడింది. పిల్లలకు ముద్రగడ వెంకటస్వామినాయుడుగారు మిఠాయిలు పంచిపెట్టారు. పెండ్యాలవారి సత్రంలో సాక్షి సత్యనారాయణమూర్తిగారు శ్రీ పొట్టి శ్రీరాములు చరిత్రను వివరించారు.

## భద్రాచలం

రాష్ట్ర వార్షికోత్సవం సందర్భంగా ఈనెల 1 వ తేదీన స్థానిక శ్రీ రామాలయంలో పూజలు జరిపారు. రాష్ట్ర స్పెషల్ అసిస్టెంటు ఏజెంటు ఎస్. వెంకటస్వామి నాయుడుగారి అధ్వర్యంలో ఊరేగింపు జరిగింది. అసిస్టెంటు ఇంజనీరు ఎమ్. బాలగంగాధరశాస్త్రిగారి అధ్యక్షతన కేశాజీ రిక్రియేషన్ క్లబ్‌లో ఉత్సవం జరిపారు.

## సామర్లకోట

సామర్లకోట స్థానికోన్నత పాఠశాలా వరణలో అక్టోబరు 1 వ తేదీన ప్రధానోపాధ్యాయులు శ్రీ కోవి సోమసుందర శాస్త్రిగారు పతాకాన్ని ఎగురవేశారు. పాఠశాలా విద్యార్థులు బుర్రకథ చెప్పారు. చిరంజీవి కొమరాజు ఆంధ్ర రాష్ట్రావతరణ చరిత్రను చెప్పారు.

## కొత్తపేట

తూర్పుగోదావరి జిల్లా కొత్తపేటలో దెందులూరి వీరభద్ర రావుగారు జాతీయ జెండాను పంచాయతీ బోర్డు ఆఫీసుపై అక్టోబరు 1 వ తేదీన ఎగురవేశారు. పట్టణ కాంగ్రెసు అధ్యక్షులు ఎమ్. వెంకటరావుగారి అధ్వర్యాన ఊరేగింపు జరిగింది. బీదలకు డిప్యూటీ తాసిల్దార్ ఎ గోపాలరావుగారు అన్నదానం చేశారు. రాత్రి జేమ్సల్ క్లబ్‌లో బహిరంగ సభ జరిగింది.

## పెరవలి

తెనాలి తాలూకా పెరవలిలో ఈనెల 1 వ తేదీన విద్యార్థుల ఊరేగింపు జరిగింది తిల్లాప్రగడ నారాయణమూర్తిగారు జాతీయ జెండాను ఎగురవేశారు యామని సీతాపతిగారు మాటాడారు. ఐక్యవిద్యార్థి సంఘంవారు నాటకలు, విచిత్రవేషాలు ప్రదర్శించారు

## కొత్తపల్లి

తెనాలి తాలూకా కొత్తపల్లి గ్రామంలో రాష్ట్రవార్షికోత్సవ సందర్భంగా విద్యార్థుల ఊరేగింపు జరిగింది. స్కూలు ఆవరణలో చాగంటి లింగమూర్తిగారు జాతీయ జెండాను ప్రతిష్ఠించారు. మల్లంపల్లి సుబ్బారావుగారి అధ్యక్షతన సభ జరిగింది. పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టారు.

## బొబ్బిలి

అక్టోబరు 1 వ తేదీన బొబ్బిలి సంస్థాన ఉన్నత పాఠశాలలో ప్రధానోపాధ్యాయులు శ్రీ ఆర్. టి. క్రిష్ణారావుగారు పతాకావిష్కరణం చేశారు. అనంతరం పాఠశాలలోని 'సహాయ కాడెట్ దళం' విద్యార్థులు పతాక వందనం, విన్యాసం చేశారు. విద్యార్థుల 'జనగణమన' గానంతో ఉత్సవం ముగిసింది.

## కాకరపర్రు

తణుకు తాలూకా కాకరపర్రు హిందీ ప్రేమీమండలివారు రాష్ట్ర వార్షికోత్సవాన్ని జరిపారు. యాళ్ల బండి గోపాలస్వామిగారు జెండాను ఎగురవేశారు. సాయంత్రం ఓ తేటి సత్యనారాయణగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. యాళ్లబండి గోపాలస్వామి, గూడపాటి వెంకటరావుగారలు విశాలాంధ్ర ఆవశ్యకతను వివరించారు.

## విస్సాకోడేరు

రాష్ట్ర వార్షికోత్సవం సందర్భంగా అక్టోబరు 1 వ తేదీన విస్సాకోడేరులో గ్రామ కాంగ్రెసు కార్యాలయంవద్ద పెన్మెత్స వెంకట్రామరాజుగారు పతాకాన్ని ప్రతిష్ఠించారు.

## పూనా

ఆంధ్రరాష్ట్ర అవతరణ ప్రథమ వార్షికోత్సవం సందర్భంలో పూనాలోని ఫెరగూసన్ కళాశాల యాంఫీ థియేటర్‌లో జరిగిన తెలుగువారి సమావేశంలో బొంబై డిప్యూటీమంత్రి డా॥ టి. ఆర్. నారాయణగారు రాష్ట్రాన్ని సాధించిన ఆంధ్రులను అభినందించారు. పూనాలోని ఆంధ్ర సంఘం తయారుచేసిన వ్రాతపత్రిక 'తెలుగు పలుకు'ను ప్రదర్శించారు. రెండు నాటికలను, శ్రీమతి ఎన్. అన్నపూర్ణ బృందంచే గానకచ్చేరీ ఏర్పాటు చేశారు. బీహార్, అస్సాం వరదబాధితుల సహాయార్థం నిధిని వసూలు చేశారు. సంఘ అధ్యక్షులు పి. జి. శర్మగారి వందన సమర్పణతో ఉత్సవం ముగిసింది.

## యలమంచిలి

యలమంచిలిలో రాష్ట్రవార్షికోత్సవం ఈ నెల 1 వ తేదీన జరిగింది. పంచాయతీ బోర్డు ఆఫీసులో ఆడారి వెంకటరమణగారు జెండాను ఎగురవేశారు. తాలూకాఫీసులో తాసిల్దార్ సుంకర శ్రీనివాసరావుగారు జెండా ఎగురవేశారు. పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టారు. గురప్పగారి సత్రంలో 1000 మందికి అన్నదానం చేశారు.

## నౌపడ

టెక్కలి తాలూకా నౌపడా బోర్డు ప్రాథమిక పాఠశాలలో అక్టోబరు 1 వ తేదీన కె. సి. హెచ్. బసవరాజుగారి అధ్యక్షతన జాతీయజెండా ఎగురవేశారు. విద్యార్థుల ఊరేగింపు జరిగింది. పాఠశాల హాలులో సభ జరిగింది. జనగణమన గీతంతో సభముగిసింది.

## పార్వతీపురం

పార్వతీపురంలో అక్టోబరు 1 వ తేదీన చర్చిలో దైవప్రార్థన జరిపారు. ఆర్. సి. ఎమ్. సెంటు జాన్సు ప్రాథమికోన్నత పాఠశాలలో జెండావందనాన్ని ఎన్. సి. మధ్యగారు జరిపారు. ప్రధానోపాధ్యాయులు ఎమ్. నడకల్ గారు రాష్ట్ర అభ్యుదయానికి చేయవలసిన కృషిని వివరించారు. విద్యార్థుల ఊరేగింపు జరిగింది.

## మహబూబు నగరం

యువజనమండలి యాజమాన్యమున తిరుమలదేవుని గుట్టపై జరుపబడిన సభలో ఆంధ్ర రాష్ట్రావతరణను గురించి పలువురు ప్రముఖులచే ఉపన్యాసములివ్వబడినవి. తెలంగాణము వారైనను, మైసూరులోని వారైనను ఆంధ్రరాష్ట్రమువారైనను, ఒరిస్సాలోని వారైనను ఆంధ్రులందరు ఎన్నటికైనను ఒకటేయని భావించుచు, వీరిలోని విభేదములు త్వరితగతిని నశింపజేసి, వారి సమైక్యతకు కృషిచేయగలందులకు తీర్మానించడమైనది.

## ముదునూరు

ముదునూరులోని పొట్టి శ్రీరాములు గారి మందిరంవద్ద రాష్ట్ర వార్షికోత్సవ సందర్భంలో కలపాల సూర్యప్రకాశరావుగారు జెండా ప్రతిష్ఠాపన చేశారు. నాగులపల్లి సీతారామయ్యగారి అధ్యక్షతన జరిగిన సభలో కొల్లి జానకిరామయ్యగారు మాటలాడారు.

# రేడియో

### ఆదివారం, అక్టోబరు 10

#### విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7 తెలుగున వా. 7-15 మద్రాసు రిలే 8 ఆంగ్లమున వా.

మ॥ 1 మద్రాసు రిలే 1-30 ఎ రిలే 1-40 హిందీన వా. 1-50 తెలుగున వా. 2 మద్రాసు రిలే.

సా॥ 5 30 పి. వెంచురామయ్య వేణువు. 6 గీతావళి మాధవపెద్ది రామస్వామి 6-15 ప్రాంతీయ వా. 6.25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ॥ కార్యక్రమం బుర్రకథ, 7 తెలుగున వా. 7-15 బుర్రకథ 7-30 మీరాచటర్జీ (స్టూ రి.) 8 కొకా సత్యవతి 8-30 ఢిల్లీ రిలే 8-45 టి. ఎన్. కృష్ణన్ (వ) 9 ఆంగ్లమున వా. 9 15 గీతావళి మాధవపెద్ది రామస్వామి 9-30 వాద్య సంగీతం (రి) 10 ప్రసార సమాప్తి.

#### మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళమున వా. 7-30 ఉదయగానము (రి) 8 ఆంగ్లమున వా. 8-15 టి. ఎస్. వీరరాఘవన్, వేదాంతం.

మ॥ 1 ఎ. ఐ. ఆర్, వాద్యగోష్ఠి 1-30 (రి) 1-40 హిందీన వా. 1-50 2 తమిళమున వా. 2-30 తిరుచి రిలే 3 ఎస్. ఎ. సుందరం (గా) చిత్తూర్ గోపాలకృష్ణన్ (వ) పాలఘాట్ మణి (మృ) 4 లలిత గానం (స్టూ. రి ) 4-30 పాశ్చాత్య సంగీతం (రి).

సా॥ 5 20 టి. వి. సుందరరాజన్. 6 ఆంగ్ల వా. 6-10 క్రీడా సమీక్ష (ఆం) 6-15 ప్రాంతీయ వా. 6-25 చిదంబరం లక్ష్మి. 7-15 తమిళ వా. 7-30 సంధ్యాగానం (రి). 7-45 ఢిల్లీ రిలే. 8 తిరుచిరిలే. 8-30 ఢిల్లీనుంచి రిలే. 9-45 బి రిలే. 8 ఆంగ్ల వా. 9-15 ఒపెన్ హౌస్ (శ్రోతల కార్యక్రమం) ప్రసంగం ఎస్. కె. చెట్టూర్. 9.25 పాశ్చాత్య సంగీతం (రి) 10-20 ప్రసార సమాప్తి.

#### మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగు వా. 7-15 కీర్తనమాల (రి) ఎం. ఎస్. సుబ్బులక్ష్మి, ఎస్. పి. వసంతకోకిలం. 7-30 పిల్లలకు (రి). 8 ఎ రిలే. 8-15 మైసూరు రిలే. 8-30 సంకీర్తనం: దివాకర్. (స్టూ. రి.) ఎం. ఎల్. వసంత కోకిలం. 8 55 రూపకం (మలయాళమున)

మ॥ 12 ఎస్. బాలసుబ్రహ్మణ్యం. 1 ఎ రిలే. 1-30 ఆంగ్ల వా. 1-40 (రి). 1-50 తెలుగు వా.

2 20 ఆటవిడుపు. 3 గీత గోవిందం (జయదేవ) సంగీత రూపకం. నిర్వహణ: వి. సుందరం అయ్యర్. 4-30 ఎ రిలే.

సా॥ 5-30 ఎ రిలే. 6-15 ప్రాంతీయ వా. 6-25 లలితగీతం అల్లాహో అక్బర్ (షహర్ జాద్ నాటకమండి) వి. లక్ష్మి, వి. వెంకటేశ్వర్లు, ఎం. సత్యం, కె. ఎస్. ప్రకాశరావు. 6-30 బుర్రకథ. 7 తెలుగు వా. 7-15 బుర్రకథ. 7-30 శ్రోతల పరిచయం. 7-45 మైసూరు చౌడయ్య (వయొలిన్). 9 ఎ రిలే. 9-45 లయ విన్యాసం (తివాగ్): అనోఖేలాల్-తబ్లా, పళని సుబ్రహ్మణ్య పిళ్లై (మృ). 10 శ్రోతలు కోరిన పాటలు (రి). 10 30 ప్రసార సమాప్తి.

#### హైదరాబాదు

ఉ॥ 6-55 సుప్రభాత్ 7 తెలుగు వా. 7-15 నవగ్రహకీర్తన కమలా రాఘవన్, మాలతీ పద్మనాభరావు 7-30 గీతావళి జి. ఇందిరా నాయుడు 7-45 దునియా ఘజల్ 8 ఆంగ్ల వా. 8-15 హిందీ వా. 8-45 డ్రామా గీత్ 9 ఆవో బచ్చో 9-45 పిలలపాట (రి) 10 బాలవినోదం (సిటీ హైస్కూలు విద్యార్థులు హైదరాబాద్.)

మ॥ 12-30 నస్మే (రి) 12-50 మరాటీ వా. 1 మహూర్ హోసేటీ (ఉర్దూ నాటిక) 1-30 (రి) 1 50 తెలుగు వా.

సా॥ 5-30 ఖయాలీ 5-45 ఘజల్ 5-55 స్థానిక ప్రకటనలు 6 మరాటిలో కార్యక్రమం 6-30 వివిధ ప్రాంతముల సరళ సంగీతం 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ 7-45 కన్నడ వా. 8 రేడియో ప్రపంచము సంగీతము రేడియో (ప్రసంగం) పర్వతనేని వీరయ్య చౌదరి 8-15 టి. ఎస్. చంద్రశేఖరన్ వేణువు (హరికాంభోజ, తిజ్జన్య రాగములు) 9 ఆంగ్ల వా. 9-15 ఉర్దూ వా. 9-30 లయచిత్రము (సంగీతరూపకము) 9-45 టి. ఎస్. చంద్రశేఖరన్ (వేణువు) క్షేత్రయ్య పదాలు 10-30 ప్రసార సమాప్తి.

# మదరాసు ధరలు

మదరాసు, అక్టోబరు 8.

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎక్స్‌ఛేంజి

| | | |
|---|---|---|
| సేల్సుటాక్సుతో సహా | రు. | 58.4.0 |
| బిస్కట్టు బంగారం తులం | రు. | 88 4.0 |
| మూస బంగారు | రు. | 86-8 0 |
| సీమవెండి తులం100కి రెడి | రు. | 159-0-0 |
| చిల్లర ధర | రు. | 1-10-0 |

#### వేరుశనగ

(581 పౌ॥ 1-కి ఎక్స్‌పోర్టు గిడ్డంగులు మెషిన్-సేల్సుటాక్సుతో సహా) రు. 110-112

వేరుశనగనూనె ఎక్సు పెల్లర్ బిలో 8% (500పా.) రెడి చిల్లరధర రు. 221-0-0

కొంకాయనూనె (87½ పౌనులు)

| | | |
|---|---|---|
| అంబుమార్కు | రు. | 80-8-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | | 80-8-9 |
| రాజా | రు. | 80-0-9 |

#### ఆముదం

తిరుపత్తూరు (500 పౌ) రు. 185-0-0

#### పంచదార

| | | |
|---|---|---|
| జవా | (56 పౌ) | 24-8-9 |
| క్యూబాన్ | (100 పౌ॥) | 36.4.9 |
| క్యూబాన్ | (250 పౌ॥) | 90 8-9 |
| పారిస్ | (2 క్వాట్సు) | 37-0-9 |

## న్యూయార్కు దూది

### అక్టోబరు వాయిదాధరలు

న్యూయార్కు, అక్టోబరు 7: న్యూయార్కు కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 34.92. |
| నేటి ముగింపు ధర | 34.95. |

## విజయవాడ మార్కెట్ ధరలు

విజయవాడ, అక్టోబరు 8: ధాన్యం: 166 పౌ॥లబస్తా కుసుమ 20-10-0రూ. ఢిల్లీ భోగాలు 22-0.0, అక్కుళ్లు 20-8-0 రూ. క. 12, 21-0-0, 24 వెంబరు రూ. 24 4-0.

బియ్యం: 246 పౌనుల బస్తాకుసుమ 48-8-0, ఢిల్లీభోగాలు 52-8-0, అక్కుళ్లు 48-8 0 క. 12, 49-0-0, వెం. 24 56-8-0.

వేరుశనగ గింజలు: 177 పౌనులు 42-0-0.

వేరుశనగపిలు: 160పౌనులు 18 4-0 రూ.లు నూనె 25 పౌనులు 11-2-0, మినుములు 240 పౌనుల బస్తా 84 రూ. పచ్చ పెసలు 22.8 0 కందులు 21-8-0 రూ.లు శనగలు 280 పౌనుల బస్తా 30 రూ.లు ఉలవలు28-8-0, మిర్చి మినుము 18-4-0, బెల్లం 4-6, కొబ్బరికాయలు వెయ్యి 122 రూ.లు, కొబ్బరినూనె డబ్బా 11-6-0, ధనియాలు 90 పౌ॥ రూ25.లు.

## బొంబాయిమార్కెట్

బొంబాయి, అక్టోబరు 8 ఈనాటి బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 166.15.0 |
| బంగారం (1 తు.) | 87-8-0 |
| సావరిన్ | 57-12-0 |